Regd No. M. 1118,

దినపత్రిక 2 అణాలు.



# ఆంధ్రపత్రిక

Founder : K NAGESWARA ROW — 3/7039 — SUNDAY EDITION

Vol. 34. ANDHRA PATRIKA, MADRAS. 28th MARCH 1948 No. 324



# కాశ్మీర్ సమస్యపై వ్యక్తిగతసంప్రతింపులు విఫలమైనట్లే

## రాష్ట్రశాసనసభ కాంగ్రెస్ పక్షనాయకత్వం

### తిరిగి శ్రీ రామస్వామిరెడ్డియార్ ఎన్నిక

### సత్వర ఆంధ్రరాష్ట్ర సిద్ధికి కృషి చేయాలని ప్రకాశంగారి హెచ్చరిక

శుక్రవారం సాయంత్రం రాజాజీ హాలు (వెనకటి బాంక్వెటింగ్ హాలు)లో మద్రాసు రాష్ట్ర శాసనసభ కాంగ్రెస్‌పక్ష నాయకత్వానికి జరిగిన వార్షికపు ఎన్నికలో ఇప్పటి నాయకుడు శ్రీ ఓమందూరు రామస్వామిరెడ్డియార్ తిరిగి ఎన్నికైనారు. 1946-47 సంవత్సరానికి కాంగ్రెస్‌పక్ష నాయకుడుగావున్న శ్రీ ప్రకాశం పంతులుగారు పోటీచేశారు. రామస్వామిరెడ్డియార్‌కు 112 వోట్లున్నూ, ప్రకాశంగారికి 84 వోట్లున్నూ వచ్చినవి. రామస్వామిరెడ్డియార్ ఎన్నికైనట్లు ప్రకటింపబడింది. వెంటనే ప్రకాశంగారు రామస్వామిరెడ్డియార్‌ను అభినందించి, తనకు కలిగిన అపజయాన్ని తాను అపజయంగా పరిగణించడంలేదనీ, ఒకవిధంగా అది విజయమే అనీ ప్రకటించారు. గెలుపొందిన రామస్వామిరెడ్డియార్ గారు ఈ విజయం తమ వ్యక్తిగతమైనదని భ్రమించడం లేదన్నారు. కాంగ్రెస్ వాదులందరూ కలిసిమెలిసి పనిచేయాలన్నారు. "మీరు పేదవారి క్షేమంకోసం ప్రత్యేక శ్రద్ధవహించి పనిచేయాల"ని అక్కడ చేరిన కార్మికులు కొందరు కోరగా "నేను రాష్ట్రప్రజలందరి క్షేమంకోసం పనిచేస్తాను" అని ప్రత్యుత్తరమిచ్చి మందహాసం చేశారు.

ఒక్కటిమాత్రం స్పష్టంగా గోచరిస్తున్నది. కొందరు, చిన్న సంఖ్య కావచ్చు, ఇప్పటి మంత్రివర్గవిధానాలతో తీవ్రంగా అసంతృప్తి చెందినారు. ఈ వర్గానికి శ్రీ వైద్యనాథఅయ్యర్ నాయకుడు. వీరందరూ శుక్రవారం ఎన్నిక అయిపోయినతరువాత సమావేశమై "సంస్కరణ సంఘం" నెలకొల్పాలని తీర్మానించుకున్నారు. వీరిలో చాలామంది పూర్వం "రాజాజీ గ్రూపు"కు చెందినవారే. ఈ గ్రూపుకు శ్రీ వైద్యనాథఅయ్యర్ సమావేశాధ్యక్షత వహించారు. ప్రస్తుత మంత్రివర్గం అనేక శాసనాలను, పంటల మీద సాగిస్తున్న పద్ధతులు, అనుసరించుచున్న విధానములు సంస్కరించవలసి యున్నాయనీ, అట్టి సంస్కరణను సాధించుటకే ఈ గ్రూపు ఏర్పడిందనీ అంటున్నారు. ఇప్పటికిప్పుడే 30 మంది శాసనసభ కాంగ్రెస్‌పక్ష సభ్యులు ఈ గ్రూపులో చేరడానికి సమ్మతించి గ్రూపు ప్రమాణపత్రంపై సంతకాలు పెట్టారు.

### సమావేశ వివరాలు

సాయంత్రం అయిదుగంటలకు సమావేశం ప్రారంభమైంది. పార్టీ నాయకుడు శ్రీ ఓమందూరు రామస్వామిరెడ్డియార్ అధ్యక్షస్థానాన్ని అలంకరించారు. అసెంబ్లీ కాంగ్రెస్‌పక్షంలో 201 మంది సభ్యులున్నారు. వీరిలో అసెంబ్లీ స్పీకరు, కౌన్సిల్ అధ్యక్షుడూ పార్టీ సమావేశాలకు హాజరుకారు. మిగతా 199 మంది 197 మంది సభకు హాజరైనారు. గైరుహాజరైనవారిలో కర్నూలు సభ్యుడు డా॥ కామయ్యతోబాటు మరొకరు ...లింగం చెట్టియార్ వున్నారు.

మొదట పార్టీ కార్యదర్శి యన్. యస్. వరదాచారిగారు సభ్యులందరూ చందాను చెల్లించినారనీ, అందరూ వోటుచేయుటానికి అర్హులేననీ ప్రకటించారు. పార్టీ సభ్యత్వ రుసుం ఇంతగా ఇదివరకు ఎన్నడూ వసూలైవుండలేదు. వెంటనే కార్యక్రమం ప్రారంభమైంది. ముందుగా బాలిజవరీడు మహాత్మాగాంధీ వార్షిక విచారం వెలిబుచ్చుచు, సంతాపం తీర్మానించారు. తరువాత అధ్యక్షుడు నాయకత్వానికి పేర్లుసూచించవలసిందిగా కోరారు. మంత్రి డా॥ రాజన్‌గారు ఓమందూరు రామస్వామిరెడ్డియార్ గారి పేరు సూచించారు. కన్నియప్పన్‌గారు బలపరచారు. ఆర్. వి. స్వామినాథన్‌గారు శ్రీ ప్రకాశం పంతులుగారి పేరును సూచించారు. తెన్నేటి విశ్వనాథంగారు బలపరచారు.

వెంటనే ఇంగ్లీషులోను, తెనుగులోను

(3-వ పేజీ చూడుడు)

## రాజ్యాంగ పరిషత్తు సమావేశం

### రాజ్యాంగచట్టం శాసింపబడును

ఢిల్లీ, మార్చి 26: ఏప్రిల్ 9 తేదీ ఇండియా ప్రభుత్వ పార్లమెంటు సమావేశము సమాప్తమగును. రాజ్యాంగ పరిషత్తుగా యీ సభ్యులందరును మే 17 తేదీ సమావేశమై నూతన రాజ్యాంగ చట్టమును పరిశీలించి చర్చించి దానిని ఆమోదించెదరు. మే నెలలోను జూన్ నెలలోను యీ సమావేశము జరుగును. ఈ 2 నెలలను ఢిల్లీలో చాలా తీవ్రమైన ఎండలు కాయుటవల్ల రాజ్యాంగ పరిషత్సభ్యులు 11 గం. నుంచి సాయంత్రము 5 గం. వరకు సమావేశమగుటకు బదులుగా ఉదయము 8 గం. నుంచి మధ్యాహ్నము 12 గం. వరకు సమావేశమయ్యెదరు.

### పోలెండు సోషలిస్టుపార్టీ

లండన్, మార్చి 26: కమ్యూనిస్టుపార్టీ నుండి వైదొలగిపోవటానికి పోలిష్ సోషలిస్టుపార్టీ ఏకగ్రీవంగా నిర్ణయించిందని వార్సా రేడియో నేడు ప్రకటించింది.

## 540 కి మించివున్న స్వదేశ సంస్థానాల పరిణామం

### ప్రజాసభ స్థాయిసంఘ చర్చావివరాలు

న్యూఢిల్లీ, మార్చి 26: అఖిలభారత సంస్థానప్రజాసభ స్థాయిసంఘం రెండు రోజుల సమావేశంలో (ఈ సమావేశం బుధవారం ముగిసింది) పండిట్ హెచ్. వి. పి. మీనన్‌గార్ల నోట్, సంస్థానములు పెద్దయెత్తున ఏర్పడటంవలన, రాష్ట్రాలలో సమైక్యం కాకపోవటంవలన సంభవించిన కొన్ని సమస్యలనుగూర్చి విస్తృతంగా, విపులంగా చర్చించిందని తెలుస్తోంది.

సభకు చెందిన స్థాయిసంఘ సభ్యుడొకడు ఈ చర్చాఫలితాన్నిగూర్చి యీ విధంగా తెలిపాడు.

(1) చిన్నచిన్న అనేక సంస్థానములను కలిపి ఒకే సంస్థానంగా చేయటం జరుగుతుంది. ఇటువంటివి 7 సంస్థానాలుంటాయి (1) సౌరాష్ట్ర, (2) మత్స్య, (3) మధ్యభారత్, (4) రాజస్థాన్, (5) వింధ్యప్రదేశ్, (6) హిమాచలప్రదేశ్, (7) పంజాబు యూనియన్.

(2) ఇవిగాక 19 పెద్ద సంస్థానాలు విడిగా ఇండియన్ యూనియన్‌కు లోబడి వర్తిస్తూవుంటాయి. కాశ్మీర్, హైదరాబాదు, తిరువాన్కూరు, కొచ్చిన్, మైసూరు, బరోడా, కచ్, గ్వాలియర్, ఇండూరు, భోపాల్, బికనీర్, జోధ్‌పూర్, కూచ్-బిహార్, త్రిపుర, మణిపూర్, జయపూర్, ఉదయపూర్, మయూర్‌భంజ్, కొల్హాపూర్, ఇవి ప్రస్తుతానికి విడిగా వుంటాయి. తరువాత రాష్ట్రాలతో సమైక్యం కాదలిస్తే కావచ్చు.

(3) నాభా, కపుర్తలా, మలేర్‌కోట్ల, జింద్, ఫరీద్‌కోట ఈ రెండూ తూర్పుపంజాబ్ సిక్కు సంస్థానాలూ ఏకమై పాటియాలా యూనియన్ సంస్థానంగా ఏర్పడతాయి. పాటియాలా ప్రస్తుతానికి విడిగానే వుంటుంది.

(4) సిమ్లా పర్వత సంస్థానాలు హిమాచల ప్రదేశ్‌గా ఏర్పడతాయి. బిలాస్‌పూర్, మండి ప్రస్తుతం విడిగానే వుంటాయి. మెహర్‌గఢ్‌వాల్ సంస్థానం యు. పి. రాష్ట్రంలో కలిసిపోతుంది.

### జి. వి. జోషిని గాంధీజీ ఆశీర్వదించలేదు

ఢిల్లీ, మార్చి 26: ప్రస్తుత సైజా ప్రభుత్వవర్గములో చేర్చియున్న జి. వి. జోషీగారు అందులోచేరి పనిచేయుటకు గాంధిమహాత్ముడు సమ్మతించి ఆశీర్వదించియుండెనని జోషీగారు చెప్పిరి. కాని యీమాట అసత్యమనియు జోషీగారి చర్యను మహాత్ముడెప్పుడును ఆమోదించియుండలేదనియు గాంధిమహాత్ముని కార్యదర్శి నూన్నమువారు ప్రకటించిరి.

## కమ్యూనిస్టు భూతం ఆసియాలో వ్యాపిస్తుందా?

### ఫ్రెంచి సోషలిస్టు పత్రిక హెచ్చరిక

పారిస్, మార్చి 26: రష్యన్ కమ్యూనిస్టు భూతాన్ని యూరప్‌లో అరికట్టడం సంభవిస్తే, అది ఆసియాఖండంపైకి విరుచుకుపడుతుందని ఫ్రెంచి సోషలిస్టు పత్రిక "పాప్యులేర్" నేడు వ్రాసింది.

"సోవియెట్ రష్యా కేవలం యూరప్ రాజ్యం మాత్రమే కాదు, అంతకంటె ఎక్కువగా అది ఆసియారాజ్యం. కమ్యూనిస్టు కుట్రలకు, కుతంత్రాలకు బహుశః ఆసియా మరింత సులభమైన రంగం కావచ్చు" అని కూడా పాప్యులేర్ వ్రాసింది.

## పశ్చిమ బెంగాలులో కమ్యూనిస్టుపార్టీపై నిషేధం

### ప్రముఖ కమ్యూనిస్టు కిసాన్‌సభానాయకుల అరెస్టు

కలకత్తా, మార్చి 26: పశ్చిమ బెంగాలుప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీని అక్రమసంస్థగా ప్రకటించింది.

నిషేధోత్తర్వు జారీఅయిన వెంటనే, పశ్చిమబెంగాలు పోలీసులు రాష్ట్రంలో వందచోట్లకుపైగా సోదా లు చూసి 58 మంది కమ్యూనిస్టు, కిసాన్‌సభ, నాయకులను వర్కర్లను అరెస్టుచేశారు. కమ్యూనిస్టుపార్టీ కార్యాలయమూ, కిసాన్‌సభ కార్యాలయమూ, కమ్యూనిస్టు దినపత్రిక స్వాధీనత ప్రచురణాలయమూ, ప్రముఖ కమ్యూనిస్టుల నివాసాలు సోదాచేయబడినవి. పోలీసులు కలకత్తాలోని పార్టీ ప్రధాన కార్యాలయాన్ని, అనుబంధ కార్యాలయాలను, స్వాధీనత ప్రచురణాలయాన్ని కట్టివేశారు. స్వాధీనత సంపాదకుడు పంకోష్ కుమార్ ఘోష్, కమ్యూనిస్టు ఎమ్. ఎల్. ఏ. జ్యోతిబాబు, బెంగాలు కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి భవానీసేన్, శ్రీ ఆంబి చక్రవర్తి, కలకత్తా ట్రాముపనివారిసంఘానికి కార్యదర్శి అయిన ధీరేన్ ముజుందార్ ప్రభృతులు అరెస్టుఅయినారు. రాత్రి సుమారు 7 గంటలకు, ధీరేన్ ముజుందార్ అరెస్టు అయినాడన్నవార్త తెలియగానే కలకత్తాలో పలుచోట్ల ట్రాములన్నీ నిలిపివేయబడినవి.

రాష్ట్రం మొత్తంమీద ఇవాళ జరిగిన 58 అరెస్టులలోనూ 40 దాకా కలకత్తాలోనే జరిగినవి, మిగతా 18 మందిహుగ్లీ, హౌరా, 24 పరగణాలలో అరెస్టు చేయబడ్డారు.

పశ్చిమ బెంగాలుప్రభుత్వం ఇవాళ అపరాహ్ణం ఈ ప్రకటన జారీచేసింది:– మార్చి 25వ తేదీగల ఒక ఉత్తర్వులో పశ్చిమ బెంగాలు ప్రభుత్వం ఇండియన్ క్రిమినల్ చట్టంలోని 16వ సెక్షన్‌ను అనుసరించి కమ్యూనిస్టుపార్టీని దాని శాఖలను అక్రమసంస్థగా ప్రకటించింది. పోలీసులు ఈ ఉత్తర్వు జారీఅయినమీదట 26వ తేదీ తెల్లవారుజామున పార్టీ నాయకులను కార్యకర్తలను కొంతమందిని అరెస్టుచేశారు. రాష్ట్రంలో అంతటా పార్టీ కార్యాలయాలను సోదా చూసి కార్యాలయాల చుట్టూ పోలీసు కాపలా పెట్టడం అయింది."

## భద్రతామండలి చర్చకు తేదీ నిర్ణయం కాలేదట

### ఏప్రిల్ 1 నుంచీ ట్సియాంగ్‌స్థానే కొలంబియా ప్రతినిధి అధ్యక్షత

న్యూయార్కు, మార్చి 27: పాకిస్థాన్, భారత ప్రతినిధివర్గ నాయకులకూ, భద్రతామండలి సభ్యులకు కాశ్మీర్ సమస్యపై యిన్ని రోజులుగా వ్యక్తిగతంగా సాగుతున్న రహస్య సంప్రదింపులు పరిసమాప్తమైనవి. ఇంతవరకూ ఎట్టి ఒడంబడిక కుదరకపోవడంవల్ల సంప్రదింపులు భగ్నమైనట్లేనని అనుకోవచ్చు. ఇకముందు యీ సంప్రదింపులను కొనసాగించడానికి యే యేర్పాటు జరుగలేదు. కాశ్మీర్ సమస్య తిరిగి భద్రతామండలికి నివేదింపబడుతుందనీ భావిస్తున్నారు. కాశ్మీర్ సమస్యపై భద్రతామండలి చర్చకు యింతవరకూ తేదీ నిర్ణయింపబడలేదు.

చైనా ప్రతినిధి డా॥ టి. యస్. ట్సియాంగ్ ఈ నెలాఖరున భద్రతా మండలి అధ్యక్షస్థానంనుంచి విరమించుకొంటాడు. ఏప్రిల్ నుంచి కొలంబియా ప్రతినిధి మండలి అధ్యక్షపదవిని స్వీకరిస్తాడు.

### తొలి వార్తలు

లేక్‌సక్సెస్, మార్చి 26: పాకిస్థాన్, భారత ప్రతినిధివర్గనాయకులకూ, భద్రతా మండలి సభ్యులకు మధ్య కాశ్మీర్ సమస్యపై యింకా సంప్రదింపులు సాగుతున్నవి. ఇప్పటికి ఉభయపక్షాల మధ్య ఒడంబడిక కుదిరే అవకాశమున్నట్లు నమ్మకంగా తెలుస్తున్నది. కాని సాగింపబడిన సంప్రదింపుల పర్యవసానమేమిటో, అధ్యక్షుడు ట్సియాంగ్ ప్రస్తుతం మండలికి తెలియజేసే స్థితిలో లేడు. గాబట్టి, సోమవారంనాడు జరుగవలసిన మండలి సమావేశం వాయిదా పడింది. కరాచీనుండి ఆ తేదీలలోగా పాకిస్థాన్ ప్రతినిధివర్గం తిరుగుతున్నదా, ప్రస్తుతం తూర్పు బెంగాలులో పర్యటిస్తున్న తమ గవర్నర్ జనరల్‌ను సంప్రదించిమరీ కర్తవ్యాన్ని నిర్ణయించుకోవాలని పాకిస్థాన్ ప్రభుత్వం ఆతురపడుతున్నదని తెలియవచ్చింది.

ప్రస్తుతం గోచరిస్తున్న కొన్ని సూచనలనుబట్టి చూస్తే ఉభయపక్షాలకు అంగీకారయోగ్యమైన పథకం యేదైనా కుదరకపోదు. అనే ఒక యింకా కొట్టుకలాడుతున్నది. అయినా మూలసూత్రాలపై ఒక సమాధానానికి రావడానికి ఉభయపక్షాలు రెండూ దాటవలసిన తీవ్ర ప్రతిబంధకాలను అలక్ష్యముగా భావించుటలేదు.

## అంతర్జాతీయ మహిళా శాంతిసంఘ స్థాపనకు కామన్సుసభ్యురాలి యత్నం

### రష్యా, అమెరికాలకు ప్రత్యేక శాంతిదౌత్యం

లండన్, మార్చి 25: "ఇంత భయంకరమూ వినాశకరమూ అయిన యుద్ధాల్ని గూర్చి పురుషులు ఇంత తేలికగా వెసంగి సెలవిచ్చి గూర్చి మాట్లాడుకొన్నంత చులకనగా మాట్లాడుతూ వుండటాన్ని నేను చాలా అసహ్యించుకుంటాను. పురుషులు కలహ ప్రియులైతే కావచ్చు కాని, స్త్రీలు కారు." అని కామన్సుసభలో సభ్యురాలు మిసెస్ మానింగ్ నేడు అన్నారు.

ప్రపంచాన్ని యుద్ధమునుండి తప్పించటానికి స్త్రీలందరినీ కూడ గట్టుకొని అంతర్జాతీయ మహిళా శాంతి సంఘము నొకదానిని తాను స్థాపింప బోతున్నట్లు, దాని వివరాలన్నీ నేడు తెలియజేసి ఆమె ప్రయత్నాలకు నాంది పలికారు.

ఈస్టర్ తరువాత రష్యాకు 100 గురు బ్రిటిష్ గృహిణుల సంఘ మొకటి బయలుదేరి శాంతిప్రచారం చేస్తుందనీ, ముఖ్యంగా స్త్రీలను యుద్ధ విముఖులుగా చెయ్యటమే దాని ఆదర్శమనీ, బయలుదేరే ముందు లండన్‌లోని రష్యన్ రాయబారినుండి అనుమతి పత్రాన్ని పొందుతామని ఆమె అన్నది.

ఒక వందమంది తూర్పు యూరప్, రష్యన్ స్త్రీలు కూడా యీ విధంగా శాంతి ప్రచారంకోసం బయలుదేర వలెనని తాను కోరుతున్నట్లు మిసెస్ మానింగ్ చెప్పినది.

"రష్యాకు వెళ్లినతరువాత అమెరికా వెడతాము. స్త్రీలు సహజంగా పురుషుల కంటే వివేకులని నా ఉద్దేశ్యం. వారికి సహజంగా నైతిక విలువలంటే ఎక్కువగా గౌరవమున్నది." అని ఆమె అన్నది. మానింగ్‌ గారికి పిల్లలులేరు. యీమెకు ప్రయాణములంటే సరదా. పురుషులు తెల్లవారూ యుద్ధాన్ని గూర్చే కలవరిస్తూ వుంటారని భరించలేక కామన్సుసభలో ఒకసారి ఈమె కళ్లనీళ్ళు పెట్టుకుంది.

### రష్యా – ఫిన్లెండు ఒడంబడిక

#### ఫిన్నిష్ రాయబారవర్గపు నివేదికపై చర్చలు

హెల్సింకి, మార్చి 26: గత వారాంతంలో రష్యా ఫిన్లాండుల మధ్య ఒడంబడిక సంప్రదింపులు జరపడానికి మాస్కో వెళ్లిన ఫిన్నిష్ రాయబారవర్గం నేటిరాత్రి ఒక నివేదికను పంపింది. ఈ నివేదికను చర్చించడానికి ఫిన్నిష్ అధ్యక్షుడు పాసికివి తన మంత్రివర్గానికి పత్యేక వార్తలు పంపాడు. మంత్రివర్గం నేటిరాత్రి సమావేశమైంది.

## జరూసెలం నగరాక్రమణకు అరబ్బుల వ్యూహం

### ఏడు వారాలలో రణరంగం కాగలదని యూదు నాయకుని హెచ్చరిక

జెరూసెలం, మార్చి 26: జెరూసెలం నగరంలోనూ, చుట్టుప్రక్కల జిల్లాలలోనూ యూదులపై దాడులను తీవ్రతరం చేయుటకు, అరబ్బులు సంకల్పిస్తున్నారనీ, నగరాన్ని ఆక్రమించుకొని, ప్రజలందరిపైనా సైనికపరిపాలన నెలకొల్పడమే అరబ్బుల ఉద్దేశ్యమనీ, యూదు ఏజన్సీ ప్రతినిధి యొకడు యీరోజు పత్రికావిలేఖరుల సమావేశంలో వెల్లడించాడు. అరబ్బులు తమ సంకల్పాన్ని అమలుజరపటానికి పూనుకొంటే, యూదులు ఎదురుదాడి చేయవలసివస్తుందని యీయన అన్నాడు. బ్రిటిష్‌వారు వైదొలగగానే ప్రస్తుతం జర్మనీలో ఉన్న 10 వేలమందిని, నార్వేజియన్ సైన్యాలను అంతర్జాతీయసైన్యంగా జరూసలెంకు పంపి శాంతిభద్రతలను కాపాడవలసిందిగా సూచించబడింది. ఏ సైన్యాలను యిక్కడకు పంపవలెనో నిర్ణయించు కొనవలసినది. ఐక్యరాజ్యసమితి త్వరపడి ఏదో యేర్పాటు జరుగకపోతే 7 వారాలలో జరూసలెంనగరం రణరంగం కాగలదు. జరూసలెంనగరంపై అరబ్బులు సంకల్పించిన దండయాత్రా ప్రయత్నాన్ని అరికట్టడానికి, నగరంలో నివసించే లక్ష మంది యూదుల ప్రాణాలను కాపాడడానికి యూదులు తమ ప్లానులను సన్నద్ధం చేసుకొంటున్నారు. జరూసలెం కోసం యుద్ధం జరగడం సంభవిస్తే అక్కడ వున్న పవిత్రదేవాలయాలు యూదు అరబ్ సంఘర్షణలో చెక్కు చెదరకుండా ఉండడం కష్టం అని యీ ప్రతినిధి తెలియజేశాడు.

జరూసలెంలో యూదు నివాస ప్రాంతంలో ఉన్న బార్క్లే బ్యాంకును దోపిడీ చేయడానికి అరబ్బులు చేసిన ప్రయత్నాన్ని యూదు పోలీసులు విఫలం చేశారని యూదు వర్గంవారు వెల్లడించిరి.

జరూసలెం నగరంలో, రోమన్ కాథలిక్ మతగురువుల ఉత్సవం యీరోజు చాలా ప్రశాంతంగా జరిగింది. ఈ ఉత్సవంలో కొంతమంది ప్రజలు గూడా పాల్గొన్నారు. వివిధమతస్థులు ఈ ఉత్సవం యింత ప్రశాంతంగా సాగి పోవడం, యూదు, అరబ్ పోరాటం తాత్కాలికంగా విరమింపబడినట్లు సూచిస్తున్నది.

### పాలస్తీనాలో బ్రిటిష్ సేనలు

వాషింగ్టన్, మార్చి 26: బ్రిటన్ ఆగస్టు 15 తరువాత కూడా తన సేనలను పాలస్తీనాలో కొంతకాలంపాటు ఉంచవలెనని అమెరికా కోరినట్లు, అందు నిమిత్తం అయ్యేఖర్చును తాను పెట్టుకుంటానని కూడా బ్రిటనుకు ప్రతిపాదన చేసినట్లు ఇటీవల బయలుదేరిన వదంతులు తనకు తెలిసినంతవరకూ నిరాధారాలని అమెరికా విదేశాంగ ప్రతినిధి మైకేల్ మాక్‌డెర్మాట్ అన్నాడు. తనకు తెలిసినంతవరకూ, ఈ విషయమై బ్రిటనుకూ అమెరికాకూ ఎటువంటి రాయబారాలు జరగడం లేదని అతడు అన్నాడు.

### చైనాకు అమెరికా సైనిక ఆర్థిక సహాయం

పారిస్, మార్చి 26: కమ్యూనిస్టులదాక్రమణను ప్రతిఘటిస్తున్న చైనా జాతీయ వాదులకు మిలిటరీ, ఆర్థికసహాయం ఇతోధికంగా చేయవలసిందని మాంఘై పౌర నాయకులు ట్రూమన్‌కొక విజ్ఞాపనపత్రం పంపినారు. యూరప్‌లో కమ్యూనిజాన్ని ఎట్లా ప్రతిఘటిస్తున్నారో చైనాలో కూడా అంతా చేస్తున్నారని వారన్నారు.

#### కార్డెల్ హల్

వాషింగ్టన్, మార్చి 26: అమెరికా ప్రభుత్వ మాజీ కార్యదర్శి కార్డెల్‌హాల్‌ను నేను చైనాప్రభుత్వం ప్రత్యేక పతకమునిచ్చి గౌరవించింది. ఈ పతకమును చైనా ప్రభుత్వం తన పౌరులలో అత్యుత్తమమైనవారికే బహూకరిస్తూవుంటుంది.

## గుంటూరు పంచాంగము

సర్వజిత్ నం॥ ఫాల్గుణ బ॥ చతుర్థి 1948 సం॥ మార్చి 28 ఆదివారం ఆశ్విని రా 1-5 విశా రా 1-50 వ ర్జ్యం ఉ 7-35 - 9-10 వ.

బ॥ పంచమి మార్చి 29సోమవారం పంచమి రా 12-55 అనూ రా 2-21 వ ర్జ్యం ఉ 7-32 వ.

ఆంధ్రపత్రిక
సర్వజిత్ సం॥ ఫాల్గుణ బ॥ చతుర్థి
ఆదివారము

## ప్రభుత్వ విధి : వైద్యుల బాధ్యత

రాష్ట్ర ప్రభుత్వ 1948-49 ఆయవ్యయ అంచనాల విమర్శించుచు ప్రజారోగ్యము, వైద్య విద్య, చికిత్సా సౌకర్యములు, వ్యాధి నివారణ కార్యముల విషయమై ప్రభుత్వము తగినంత, అవసరమయినంత శ్రద్ధ చూపలేదని, గుంటూరు వైద్య కళాశాలను ప్రస్తుతమునకు నిలుపు చేయుట అసమంజసమని వ్యాఖ్యానించి యుంటిమి. గుంటూరు వైద్య కళాశాలను కొనసాగించుటకే ప్రభుత్వము నిర్ణయించినట్లు ఈనెల 19-వ తేదీన ఆర్థికమంత్రి ప్రతిపాదించిన "సప్లిమెంటరీ డిమాండ్ల" వలన స్పష్టమైనది. ఇందుకు రాష్ట్ర ప్రభుత్వమును అభినందింపవలసి యున్నది. కాని వైద్యవిద్యా వ్యాప్తియందు, ప్రజారోగ్య అభివృద్ధి యందు ప్రభుత్వము చూపుచున్న ఔదాసీన్యము ఆందోళనకరముగ నున్నది. ఆరోగ్యశాఖా మంత్రి శ్రీ ఎ. బి. శెట్టి ఆరోగ్య శాఖా డిమాండ్లపై జరిగిన చర్చకు సమాధాన మొసగుచు, మద్యపాన నిషేధ కార్యక్రమము కూడ ప్రజారోగ్యమునకు సంబంధించినదే గనుక తద్వారా ప్రభుత్వము భరించుచున్న నష్టము ఆరోగ్య శాఖపై ఖర్చు పెట్టుచున్నట్లే పరిగణింపవలసి యున్నదని సమర్థించిరి. ఇంతవరకు మద్యపానము వలన ఆరోగ్యమును కోల్పోయిన, నిస్సారమైన ఆహారము వలన దారిద్ర్యమును పోగొట్టుకొనిన ప్రజలకు, ఇకమీదట అనుసరింపబడు మద్యపాన నిషేధ కార్యక్రమము వలన ఆరోగ్యము, పుష్టి ఏర్పడదు. ఇప్పటికి మద్యపాన నిషేధ కార్యక్రమము వలన ప్రభుత్వాదాయమునం ఏర్పడిన లోటు కన్పించినంత నిర్దుష్టముగ, రాష్ట్రమందు ఫలితములు కన్పించుట లేదు.

ఇప్పటికి రెండు సంవత్సరముల క్రితము సమర్పింపబడిన "భోర్ కమిటీ నివేదిక"ను అమలు పరచుటకు ఈ రాష్ట్ర ప్రభుత్వ మెట్టి చర్యలును తీసుకొని యుండ లేదు. గ్రామసీమలందు చికిత్సా సౌకర్యముల వృద్ధి చేయుట, వ్యాధినివారణ కార్యములను అమలు చేయుట అత్యంతావశ్యకమని, ప్రజారోగ్యమువిన వల్లెలందలి ప్రజల ఆరోగ్యమును చక్కబరచుటే నని భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రిణి పదే పదే హెచ్చరిక చేయుచునే యున్నది. అందువలన రాష్ట్ర ఆరోగ్యశాఖా మంత్రిణి వైద్య, చికిత్సా సౌకర్యములు గ్రామీణులకు అందుబాటులో నుండునట్లు చేయుటకు కొన్ని పథకములను తయారు చేసెను. దేశీయ వైద్య అభివృద్ధికి కొన్ని ప్రణాళికలను సూచించెను. మంత్రివర్గము మార్పు చెందుటతో ఈ పథకములు వెనుకబడి పోయినవి. ఇప్పటి ఆరోగ్య శాఖామంత్రి వైద్యవిద్య సంస్కరణపై చూపుచున్న అభిమానము ప్రజారోగ్యము విషయమున చూపుటలేదు. నిన్నటి దినము నెల్లూరులో సమావేశమైన ఆంధ్ర వైద్యమండలి సభకు అధ్యక్షత వహించిన శ్రీ యం. వి. కృష్ణరావుగారు ఈ సమస్యను సవిస్తరముగ చర్చించి ప్రభుత్వమునకు కొన్ని సూచనలను చేసిరి. రాష్ట్రమందలి వైద్యుల కర్తవ్య బాధ్యతలను వివరించిరి. ప్రస్తుతము రాష్ట్రమునకు అంతటికి ఒకే ఒక ప్రజారోగ్యకళాశాల గలదు. ప్రజారోగ్య, వైద్యశాఖలు, శిక్షణ విద్యావ్యాసంగము వేరు వేరుగనే ఉంటున్నందున తెనుగు ప్రాంతమునకు ప్రజారోగ్య కళాశాల, పరిశోధనాలయము అత్యంతావశ్యకమని డాక్టర్ కృష్ణరావుగారు చేసిన సూచనను ప్రభుత్వము గుర్తించి వెంటనే అవసరమైన చర్యలను తీసుకొనవలసి యున్నది. అల్లె తేయరోగము సంబంధించిన పరిశోధక సంస్థను ఆంధ్రప్రాంతమున నెలకొల్పుట అత్యంతావశ్యకము, ప్రస్తుతము "శానిటరీ ఇన్‌స్పెక్టర్సు" కోర్సు చెన్నపట్నమునందు మాత్రమే యున్నది. అట్లుగాక విశాఖపట్నమునందలి వైద్యకళాశాలయందును ఇట్టి శిక్షణకు అవకాశములు కల్పింపవలెను.

ప్రభుత్వము తన విధులను గుర్తించి వ్యవహరించుటతో బాటు వైద్యులుకూడ తమ బాధ్యతల, ధర్మముల గుర్తెరిగి ప్రవర్తింపవలసి యుండునని నెల్లూరు సభాధ్యక్షులు హెచ్చరించి యుండెను. ప్రస్తుతము వైద్యులు హెచ్చుమంది పట్టణములందే, ప్రభుత్వ వైద్యశాలలు ఉన్న ప్రాంతములందే, చేరుచుండిరి. ధనార్జనే ప్రధాన లక్ష్యముగ నుంచుకొని. అట్లుగాక వైద్యులు గ్రామములపై తమ దృష్టి మరల్చి పని గ్రామములకు కేంద్రముగనున్న ప్రదేశములందు స్థావరమేర్పరచుకొని, ప్రజా సేవా తత్పరతతో పనిచేసిన ప్రభుత్వము సాధింపలేని పనులను వీరు సాధింపగలుగుదురు.

ప్రజారోగ్యమును గురించి అందరు విశేష శ్రద్ధ వహింపవలసి యున్నదని హెచ్చరిక చేయుచు భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖ కార్యదర్శి శ్రీ జీవరాజ మెహతా గారు ఆరోగ్యవంతులైన ప్రజలు తయారుకాకున్న స్వాతంత్ర్యము నిరుపయోగమనిరి. చికిత్సా విధానముపైకంటె, వ్యాధి నివారణ ప్రజారోగ్యము విషయమై ఎక్కువ శ్రద్ధ వహింపవలసి యున్నది.

## రాజ్యాంగంపై చర్చ

### ఏ. ఐ. సి. సి. కార్యక్రమం

న్యూఢిల్లీ, మార్చి 26: బొంబాయిలో ఏప్రిల్ 24, 25 తేదీలలో సమావేశమయ్యే అఖిల భారత కాంగ్రెసు కమిటీ కాంగ్రెసు నూతన రాజ్యాంగమును క్లాజు వారీగా ఆఖరు పర్యాలోచనం చేస్తుంది. ఆర్థిక కార్యక్రమ కమిటీవారి నివేదికను కూడా వారు చర్చిస్తారు.

పాకిస్తానులో వున్న కాంగ్రెసు కమిటీలను ఉంచటమా, రద్దుచేయటమా అనే ప్రశ్న సహితం బొంబాయిలో జరిగే సమావేశం చర్చిస్తుందని తెలుస్తోంది.

## కలాత్ సంస్థానంలో పాకిస్తాన్ ప్రతికూలోద్యమం

### సంస్థాన ప్రధాని రాజీనామా : శాసనసభ వాయిదా

కరాచీ, మార్చి 26: కలాత్ సంస్థాన ప్రధాన మంత్రి నవాబ్జాదా మహమ్మద్ అస్లాంఖాన్ రాజీనామా ఇచ్చాడు. కలాత్ సంస్థానం పాకిస్తానులో ప్రవేశించవలెనా లేదా అన్న విషయమై అంత్యనిర్ణయం చేయుటానికి క్వెట్టాలో మార్చి 25న జరుపదలచిన కలాత్ ఉపరి శాసనసభా సమావేశం గడువు నిర్ణయం లేకుండా వాయిదా వేయబడింది.

పాకిస్తాన్ రాజకీయ శాఖోద్యోగి యున్నూ కలాత్ ప్రధాన మంత్రియున్నూ అయిన నవాబ్జాదా మహమ్మద్ అస్లాంఖాన్ గడచిన రెండుమాసాలుగా, కలాత్ పాకిస్తాన్‌లో చేరిపోవలెనని, తీవ్రంగా ఆందోళన చేస్తున్నాడు. క్వెట్టానుంచి వస్తున్న వర్తమానాలనుబట్టి కలాత్ జాతీయ పక్షం సంస్థానంలో పెద్దయెత్తున ప్రవేశ ప్రతికూలోద్యమం ప్రారంభించిందని తెలుస్తున్నది. "బెలూచీ లందరూ ఐక్యంకావాలి", "బెలూచిస్తాన్ స్వతంత్రంగా వుండాలి" అని జాతీయ పక్షంవారు నినాదాలు లేవదీసున్నారు. పాకిస్తాన్‌లో శాసు బోతుతనం, అవినీతి, లంచగొండితనం ప్రబలిపోయి పాపకూపంగా పరిణమించిందనీ, ఇస్లాంమతం పేరిట కోటి మతస్థుల సాకారాన్ని అభ్యర్థించే వాక్కులు కూడా పాకిస్తాన్ కోల్పోయిందని, వారు వాదిస్తున్నారు.

కలాత్ సంస్థానం పాకిస్తాన్‌లో ప్రవేశించ వచ్చునన్న ఆశే ఆ తుడానికి అడుగంటిపోయిందని చెబుతూ, పాకిస్తాన్ సంస్థాన ముస్లింలీగు అధ్యక్షుడు మంజరీ ఇలాహ్ ఇలా అన్నాడు: "సంస్థాన జాతీయ పక్షంవారి చేతులలోకి విశేషాలు డబ్బు సప్పించి పాకిస్తాన్ ప్రతికూలాందోళనను యథేచ్ఛంగా సాగిస్తున్నవి. సర్దార్లను తన నెపునకు తిప్పుకోడానికి సంస్థానాధిపతి కూడా ఎన్నో విధాల జారీకి అంటలు పెడుతున్నాడు. వాస్తవిక దృష్టితో నిరీక్షకులను పరిశీలించి పాకిస్తాన్‌లో ప్రవేశంచేసుకోడం యొక్క ఆవశ్యకతను గుర్తించవలసిందని, కలాత్ సంస్థానాధిపతి విజ్ఞప్తి చేస్తున్నాడు.

హింసా, నిర్బంధ ఉద్యమాలకు మేము విముఖులం. పాకిస్తాన్‌లో చేరడమే సంస్థానానికి శ్రేయస్కరం అన్న విషయాన్ని నవాబుకు సామ్యంగా నచ్చచెప్పడానికి మేము శతధా ప్రయత్నిస్తాము. పాకిస్తానులో చేరడంవల్ల తన స్వాధీనతకు ఏవిధంగానూ భంగం కలగదనీ, పరస్పర సహకార ఒడంబడిక చేసుకోడం అక్కరగానానికి ఏమాత్రమూ విరుద్ధంకాదనీ కలాత్ నవాబు గ్రహించాలి. తిలం చుకుంటే సంస్థాన ముస్లింలీగు కలాత్‌లో అటకట్టించ గలదు. కాని మేము ఈ సమస్యను శాంతియుతంగాను, సామ్యంగానూ పరిష్కరించాలని కోరుతున్నాము."

### సామంత సంస్థానాల చేరిక : కలాత్ నవాబు ప్రకటన

క్వెట్టా, మార్చి 26: కలాత్‌కు సామంత సంస్థానాలైన కరాన్, మెక్రాన్, లాస్ బేలాల చేరిక విషయమై పాకిస్తాన్‌తో వచ్చిన వివాదను సామ్యంగా పరిష్కరించుకోగోరుతున్నానని కలాత్ సంస్థానాధిపతి నిన్న ఒక ఇంటర్వ్యూలో ప్రకటించాడు. ఇండియాతోనూ ఆఫ్ఘనిస్తాన్‌తోనూ తాను రహస్యంగా రాయబారం జరుపుతున్నానన్న వార్తలు సుద్ద అబద్ధమని నవాబు ఖండించాడు. "పాకిస్తాన్‌తో ఐక్యంగా ఉందామనే నేను కోరుతున్నాను కాని నేను చేసిన సామరస్య సూచనలకు నేటికి పాకిస్తాన్ వైపునుంచి తగిన ప్రతిఫలం కనిపించలేదు. మాతో పాకిస్తానులో చేరడం విషయమై రాయబారాలు ఇంకా పూర్తి కాకముందే, మా సామంత సంస్థానాలను పాకిస్తాన్ తనలో చేరుగా, కలిపివేసుకోడం నాకు చాలా నిర్ఘాంతం కలిగించింది" కలాత్ నవాబ్ ప్రధానమంత్రి నవాబ్జాదా మహమ్మద్ అస్లాంఖాన్ రాజీనామాను ఆమోదించాడు.

### కొల్హాపూరులో సోదాలు

కొల్హాపూరు, మార్చి 26 : గాంధిమహాత్ముని హత్యజరిగిన వెంటనే ఇండ్లు తగులబెట్టుట, లూటీలు చేయుట మొదలగునవి జరిగెను. ఆసందర్భములగూర్చి ఫిర్యాదులు వచ్చెను. వీటివిషయమై కొల్హాపూరు సంస్థానములో దర్యాప్తు జరుగుచున్నవి. తాలంపుముమున దీక్షగా పనిచేయుచున్నవారి ఇండ్లకు సోదా చేయవలసినదిగా కొల్హాపూరు అడ్మినిస్ట్రేటరు వి. నంజప్పగారు ఉత్తరువులు జారీచేసిరి.

## ట్రీస్టు సమస్య

### బ్రిటన్, అమెరికాల వైఖరి : టిటో ఖండన

బెల్‌గ్రేడ్, మార్చి 26: "ట్రీస్టుని ఇటలీకి వప్పగించి పెట్టాలని, బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సులు చేసిన ప్రతిపాదన ఇటాలియన్ ప్రజలను వంచనచేయడానికి, యూగోస్లావియాపై ఇటాలీ.అన్న ద్వేషాన్ని రెచ్చగొట్టడానికి, ఇటాలియన్ ప్రజాస్వామ్య శక్తులు తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పరిరక్షణకో సంరక్షించుకోకుండా ముడుగులసని ఉద్దేశింపబడినదే ఇది ఎన్నికలకారకు వేసినయెత్తు" అని యుగోస్లావియా ప్రధాని మార్షల్ టిటో, ఇస్ట్రియాలో జరిగిన ఇటాలియన్ అల్పసంఖ్యాక ఉత్సవ సందర్భంలో ఉపన్యసిస్తూ అన్నాడు. యీ ఉత్సవంలో, వైజ్ఞానిక కార్యకర్తలు, పారిశ్రామిక, వ్యవసాయిక కార్మికులు పాల్గొన్నారు.

"ఉభయదేశాలమధ్య ఉత్పన్నమైన సమస్యలను సమరసంగా పరిష్కరించుకోవడానికి యుగోస్లావియా సర్వదా సంసిద్ధమే" ఇరుగు పొరుగు ప్రజలతో ఆనోన్యస్థితి గలిగి శాంతియుతంగా జీవించడమే తన అభిలాష అని, నవయుగోస్లావియా రుజువుపరచుకొన్నది. కృతిమదేశాభిమానాన్ని పురికొల్పి, 'దేశాలమధ్య పరస్పర సంఘర్షణలను రగుల్కొల్పాలి', యుద్ధోన్మాదులు సాగిస్తున్న ప్రచారాన్ని అరికట్టడానికి ప్రజాస్వామ్య శక్తులన్నీ సమైక్యం కావాలి. ట్రీస్టుని ఇటలీకి కట్టబెట్టాలంటూ, ఇటీవల బ్రిటన్, అమెరికా ఫ్రాన్సులు చేసిన ప్రతిపాదన, అసాధారణమైనకాత్తయెత్తు." ట్రీస్టు సమస్యను ప్రజాస్వామ్యయుతంగా క్రమబద్ధంగా పరిష్కరించడానికి యుగోస్లావియా చేసిన ప్రయత్నాన్ని త్రోసిరాజన్నారు. ఇప్పటికీ యుగోస్లావియా సూచనను ప్రతిఘటిస్తున్నారు.

ఇటలీ రేవులలో ఉండే అమెరికా నావాదళంగాని, 20 మార్షల్ ప్రణాళికలుగాని ఇటలీ యుగోస్లావియాల సమస్యలను పరిష్కరించలేవు. ఇటాలియన్ ప్రజల స్వేచ్ఛాభీష్టము, యుగోస్లావియా ప్రజల సమ్మతి యుకే, ఉభయదేశాల పరస్పర స్నేహపూరిత సహకారానికి పోటంకంగా ఉన్న సమస్యలను పరిష్కరించగలవు" అని మార్షల్ టిటో అన్నాడు.

## ఇటలీలో కమ్యూనిస్టుల ఉపద్రవం

### లక్షమంది ఏకీకరణం : ఎన్నికలముందే సంక్షోభం ?

లండన్, మార్చి 26: ఇటలీలోని పగ్లియా, రోమాగ్నో, ఎమిలియా రాష్ట్రాలలో లక్షకుపైగా, కమ్యూనిస్టు సైన్యాలు కేంద్రీకరింపబడినాయి. ఏప్రిల్‌లో ఎన్నికలు ప్రారంభం కాకముందే పోరాటం మొదలు కావచ్చునని ఒక రోమ్‌వార్త తెలుపుతోంది. ప్రస్తుత గాస్పెరి ప్రభుత్వం ఎన్నికలను జూన్‌వరకూ జరుపుచేసి శాంతిభద్రతలను నెలకొల్ప ప్రయత్నిస్తోంది.

కమ్యూనిస్టు సైన్యాలకు ఇటలీలో ఎదురులేదు. వీటికి నాయకుడు పీట్రో కాచ్చియా. ఇతడు స్టాలిన్‌కు ప్రియస్నేహితుడు. మాస్కోలో చాలకాలం వున్నాడు. స్పెయిన్‌లో జనరల్ ఫ్రాంకోతో పోరాడాడు. అతనికి ఇంకా ఇద్దరు బలీయులైన సహచరులు ఉన్నారు. ఈ సంగ్రహ ఆలోచనలమీదనే ఇటలీ భవిష్యత్తు, అనూటకొస్తే ప్రపంచశాంతి ఆధారపడివున్నాయి. (ఎ. పి. యస్)

## మైకేల్ రాజును హత్య చేస్తామని బెదిరింపు

న్యూయార్కు, మార్చి 26: రుమేనియా పూర్వపురాజు మైకేల్‌ను హత్య చేస్తామని బెదిరింపులు వస్తున్నాయనీ, ప్రముఖ అమెరికన్ కాంగ్రెసు పక్షమువారు, రాయబారులు నివసించే వాల్‌డార్ఫ్ హోటలులో మైకేల్ వుంటున్నాడనీ, అతని అంగరక్షక దళం 15 మందివరకూ పెంచబడినదనీ అమెరికన్ పత్రికా రచయిత విన్‌ఛెల్ వ్రాస్తున్నాడు. తాను సందర్శించినప్పుడు మైకేల్ పాలిన ముఖంతో, వణుకుతూ ఆందోళన పడుతూ వున్నాడని కూడా విన్‌ఛెల్ వ్రాశాడు. అతనిని దూరదేశపు ప్రదేశానికి తీసుకు పోవాలని అమెరికా ప్రభుత్వం యోచిస్తోందట.

### అమెరికాతో ద్వాటు

బెర్లిను, మార్చి 26: రుమేనియా నుండి వెడలిపోయినవారికి రుమేనియా రాజు మైకేలు నాయకత్వం వహించినాడనియు, వీరికందరికిని అమెరికా ప్రభుత్వంతో ద్వాటుపాగి ప్రస్తుతము రుమేనియాలో ఏర్పడిన ప్రభుత్వానికి ప్రతికూలంగా పురికొల్పుచున్నదనియు రుమేనియా విదేశాంగమంత్రి మాదాం అన్నా పాకరుపతి నిన్న చెప్పెనని యుగోస్లావియాకు చెందిన టాన్‌జంగు రుమేనియా వార్తా సంఘమైన టాన్‌జుంగు ఖుఖారెస్టునుండి ప్రకటించెను.

## శ్రీ రామస్వామి రెడ్డియార్ ఎన్నిక

(1-వ పేజీ తరువాయి)

తెనుగులోనూ బాలట్ పత్రాలు సభ్యులకు పంచారు. ఈ కార్యక్రమం ఇరవైనిమిషాలు పట్టింది. రామస్వామి రెడ్డియార్ గారు వోటు వేయలేదు. వోట్లు లెక్కించడానికి యస్. శంకర సుబ్రహ్మణ్య మొదలియార్, కన్నెటి విశ్వనాథ నాయుడు నియమించారు. లెక్కపూర్తి అయి ఫలితం ప్రకటించేసరికి 8 గం.లైంది.

### అనుకూల, ప్రతికూల ప్రదర్శనలు

ఎన్నికఫలితం వెల్లడియైనకాక బయట 'రామస్వామి రెడ్డియార్‌కి జై' అని, 'అంధ్రాన్ డౌన్ డౌన్' అనీ నినాదాలు చెలరేగాయి. రెడ్డియార్ విజయంతో సంతోషం వీరుడైన ఒకవ్యక్తి పరుగుపరుగున హాలులోనుంచి బయటకువచ్చి, పరాపరి తూర్పువైపు వరండాలవద్దకువెళ్ళి "రెడ్డియార్ గెల్చాడనీ ప్రకాశం ఓడిపోయాడనీ, ఓట్లు 118 ఒకరికి 88 ఒకరికి వచ్చాయనీ అరిచాడు.

దానితో ఆవరణలోని వారిలో ఒకవర్గం 'రెడ్డియార్‌కి జై, 'అంధ్రాన్ డౌన్ డౌన్' అంధ్ర కేసరి కళాయిం, టూపుకి జై అని ప్రాంతముల దే, 'సావార్ జిందాబాద్' అని నినాదాలు మొదలుపెట్టారు. హాలులోనుంచి సభ్యులు ఒక్కొరొక్కరే బయటికివస్తుంటే వారిని చూసి ఈ నినాదాలు మరీ రెచ్చినాయి. ఎస్. ఎస్. వరదాచారిగారు వస్తుంటే చెప్పులు వేశారు. సభ్యులు మెట్లుదిగి ఆవరణ బయటకు వచ్చేవరకూ పోలీసులు దారికి రెండువేపులా నిలబడి జనాన్ని ముందుకు దూసుకుండా అరికట్టారు. సమావేశం జరుగుతూ ఉండగా కొందరు ప్రదర్శనలు జరపగా పోలీసులు జోక్యం కలిగించుకోవలసి వచ్చింది.

క్రిందటి సంవత్సరం రామస్వామి రెడ్డియార్‌గారితో ప్రకాశం పంతులుగారు పోటీ చేయగా రెడ్డియార్ గారికి 116 ప్రకాశంగారికి 73 వోట్లు వచ్చినవి. ఈ సంవత్సరం రెడ్డియార్‌గారికి 4 వోట్లు తగ్గిపోయినవి. ప్రకాశంగారికి 11 వోట్లు ఎక్కువవచ్చినవి.

ఆఖరు క్షణంవరకూ ప్రకాశంపంతులుగారికి గలిచే అవకాశాలు బాగానే ఉన్నాయని అనుకున్నారు. కాని మామూలుగానైతేనన్ని ఎన్నికల్లో జరిగేటట్లే ఈ ఎన్నికలోనూ ఆఖరు క్షణంలో ఒకటికి ఒకటి చేసేవారూ, మీకే ఇస్తామని ఎదుటపక్షానికి వచ్చేవారూ ఉన్నారు. డాక్టర్ సుబ్బరాయన్‌గారు ఆఖరువరకూ చాలా నాటకం ఆడారు. ప్రకాశంగారిపక్షంవారు వీరిపైన ఎక్కువ ఆశలు పెట్టుకున్నారు. వీరు మంత్రిపదవికి రాజీనామా ఇచ్చి తమతో బహిరంగంగానే చేరిపోతారేమో అనికూడా అనుకున్నారు. అసలు సుబ్బరాయన్‌గారు పరిస్థితులను వినియోగించుకొని తామే ప్రధాని అవుదామనుకున్నారు ఒకస్థితిలో అరవ-ఆంధ్రవిభేదాలు మరీ హెచ్చిపోయి ఏవిధంగానైనా సరే తెలుగువారి నాయకత్వం ఏర్పడకుండా చేయడానికి అరవలు సుబ్బరాయన్‌గారినే నిలబెట్టి ప్రకాశంగార్ని ఓడించాలని ప్రయత్నించారు. సుబ్బరాయన్‌గారు తన్నే ప్రధానమంత్రిపదవి, లేకపోతే ఇప్పటిఉద్యోగం భాగ్యం అనేధోరణితో వ్యవహరించారు. వాస్తవంగా ఇలాంటివారు ఏ మంత్రివర్గంలోనూ ఉండతగరని అందరూ విమర్శిస్తున్నారు.

ప్రకాశంపంతులుగారు దీనాట గానిని ఋగ్ధం చేసుకోలేకపోయారని చాలామంది అంటున్నారు. ఇంత లేదా రాగలదనే అనుమానం ఏకొంచెం ఉన్నా ప్రకాశంపంతులుగారు పోటీచేయకుండా ఉంటేనే బాగుండేది, ఈవిధంగా నిలబడి ఓడిపోకుండా ఉండటంవల్ల ఆంధ్ర అరవవిభేదాలు, ఆంధ్రుల్లోనే వివిధవర్గాలమధ్య అంతఃకలహాలు పెరిగిపోయి రాష్ట్ర రాజకీయాలు అధోగతి పాలవుతవని ఆంధ్రప్రముఖులు పలువురు విచారిస్తున్నారు. ఎన్నికలముందు ఏ ఆంధ్ర ఐక్యత కొరకు ప్రకాశంగారు కృషిచేశారో అది ఇప్పుడు మరీ దూరమైపోయింది. ఉన్న తెనుగు సభ్యులు 79 మందిలోనూ దాదాపు సగంమంది ప్రకాశంగారికి ప్రతికూలంగానే వోటు చేశారు. ప్రకాశంగారికి వోటుచేసిన తెనుగువారికంటె రామస్వామిరెడ్డియార్‌కు వోటుచేసిన తెనుగువారే ఎక్కువ. ఆంధ్రేతర వోట్లే ప్రకాశంగారికి ఎక్కువ వచ్చినవి.

### శ్రీ ప్రకాశంగారి ఉద్బోధ

నాయకత్వపు పోటీఫలితం తెలిసి నిరుత్సాహంతో యుంటినందర చేసిన అనుయాయులతో శ్రీ టి. ప్రకాశంపంతులుగారు యిష్టాగోష్ఠిగా మాట్లాడుతూ తమకు ఓటమి సంభవించవని ప్రజలునిరుత్సాహం గాని చింతగాని పడరాదని చెప్పిరి. ఈ ఓటమి నిజం - తమకు విజయమునే తాను భావిస్తున్నట్లును ఆంధ్రరాష్ట్రమును సాధించుటకు మరింత తీవ్రప్రయత్నాలు సాగించుటకిది అవకాశము నొసగుచున్నదనియు చెప్పిరి. ప్రజలు పడియుచున్న అనేక కష్టాలు తెలిపివాటిని నివారించవలెనని

## పట్టణ వార్తలు

### జమీందారీల రద్దుబిల్లు సెలెక్టుకమిటీ సభ

మదరాసు, మార్చి 27 : జమీందారీల రద్దుబిల్లు సెలెక్టు సభ యీదినం సెక్రెటేరియేటులో ఉదయం 9-30 మొదలు 12-30 గం. వరకు జరిగినది. జమీందారులకు నష్టపరిహారం మొదలైన విషయాలపై చర్చ సాగిన తరువాత ఏప్రిలు 15వ తేదీవరకు వాయిదా వేయబడెను.

### మదరాసు సెక్రెటేరియట్ పార్టీ

మదరాసు సెక్రెటేరియట్ పార్టీ వార్షికోత్సవం మార్చి 29వ తేదీ సాయంత్రం 5 గం. క్వీంస్‌వేటింగ్ హాలులో జరుగును. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ కే రామునిమీనన్‌గారు అధ్యక్షత వహింతురు.

### మంత్రి శ్రీ భక్తవత్సలంగారు

మదరాసు, మార్చి 27 : పబ్లిక్‌వర్క్సు మంత్రి శ్రీ ఎం. భక్తవత్సలంగారు ఏప్రిల్ 2వ తేదీని మైసూరు బయలుదేరి అక్కడ ఏప్రిల్ 3 నుండి 6వ తేదీలకు మైసూరు ప్రభుత్వంతో యిరిగేషను ప్రాజెక్టులు నీరు పంపకము తుంగభద్ర ప్రాజెక్టుకు సంబంధించే విషయాలు చాయలనీనుకు మైసూరు ప్రభుత్వం విద్యుచ్ఛక్తిని అనుపు యిచ్చి సరఫరా చేయుటకుగల అవకాశాలను గూర్చియు చర్చించెదరు. పిదప ఏప్రిల్ 7వ తేదీని ప్రారంభమయ్యే మైసూరు రాజ్యాంగపరిషత్సభలో హాజరై ఏప్రిల్ 8వ తేదీనాటికి చెన్నపురికి తిరిగి వచ్చెదరు.

### మదరాసు శాసనసభల పునః సమావేశం

మద్రాసు, మార్చి 27 : మదరాసు అసెంబ్లీసభ ఏప్రిల్ 19వ తేదీనను, కౌన్సిలుసభ ఏప్రిల్ 20వ తేదీనను రద్దయ్యేకారణాలను పునరుద్ధరించే పట్టాలను ఆలోచించుటకు సమావేశమగును. ఆతరువాత జమీందారీ రద్దుబిల్లు శాసన మొనర్పుటకు సమావేశములో సమావేశమగును.

### పంటబావులకు సబ్సిడీలు

చెన్నపురి, మార్చి 26 : 1948 మార్చి 31 లోగా పంటబావుల నిర్మాణానికి సబ్సిడీబులవాలు పొందుటకు అర్హులైన వారు నిర్మాణమును పూర్తిచేయవలసిన తేదీని 1948 జూన్ 30 నుంచి 1948 సెప్టెంబరు 30 తే వరకూ పొడిగించినట్లు మద్రాసు ప్రభుత్వం ప్రకటించుచున్నది.

### నూలుపై వాణిజ్య సుంకం

చెన్నపురి, మార్చి 26 : చెన్నరాష్ట్రంలో నూలురవాణాపై నిర్బంధాలను ప్రభుత్వం మార్చి 16 తే నుంచి తొలగించి సందుకల్ల చేపడుతున్నాలు తప్ప ఇతర నూలుపై వాణిజ్యసుంకాన్ని ఎట్లు విధించాలో ప్రభుత్వం ఇంకా నిర్ణయించలేదు. నిర్ణయం అయ్యేలోగా, ఎప్పటిమాదిరిగా ఎక్స్‌మిల్ కోటా హోల్డరు అమ్ముతున్నప్పుడు మాత్రమే నూరింట 5 వంతు వాణిజ్య సుంకం విధించబడుతుంది.

### మదరాసు కార్పొరేషను

మదరాసు కార్పొరేషనుకౌన్సిలు బుధవారం సమావేశమయినప్పుడు బడ్జెటుచర్చ కొనసాగెను. శ్రీ కద్ది రంగయ్యనాయుడుగారు, గాంధిగారి విగ్రహం కి రు. 50,000 ఖర్చుచేయుటకన్న వారిపేరున ఒక నాటకశాల లేక భవనం కట్టించుట మంచిదనిరి. పి.జాయి నగరంయద్దు పేదలకు ఉపయోగపడలేదు గనుక, యింక ఎక్కువగ కట్టించరాదనిరి. దామోదర నాయుడుగారు రూ 50 పైన అద్దెవచ్చు యిండ్లకిటికి పన్ను ఎక్కువ వసూలగోరిరి.

కమిటీవారి సూచనపై ఉమన్సు క్రిష్టియను కాలేజీకి రూ 10,000 యిచ్చుట అంగీకరించబడెను.

పిజాయి నగరమందు ఎ బి తరగతి యిండ్లు నిలిపి, సి. డి. తరగతుల యిండ్లను, పేదలకు అద్దెయిందు కట్టించుటకు కమిషనరుకి వర్క్సు కమిటీవారు సూచించిరి.

ఉద్దేశ్యముతోనే యీ మారుమూల యీ ప్రయత్నానికి తాను పూనినట్లును డా॥ సుబ్బరాయన్‌కూడా తెల్పె. జలపరుచుకటులు మొదట చెప్పిపోటం ఆయనకు మనోస్థయిర్యము లేక మారిపోవడం జరిగిందదున యీ పశ్చాత్తాపము చేతనే వారనియు దీనివల్ల మనం నిజస్థితి గతులు తెలుసుకోడం వీలైనదనియు చెప్పిరి. మహాత్మాగాంధీ చనిపోవుటకు ముందు తాను ఆయనను చూచినప్పుడు చెన్నరాష్ట్ర ప్రజలందరూ ఐక్యతతో తమ సమస్యలన్నీ పరిష్కరించుకోమని సలహా యిచ్చినారనియు, ఆ సలహో అనుసరించే తాను ఎన్నికలపైలవలో మాట్లాడి ఐక్యతను కొనసాగించుటకు ప్రయత్నము చేసినను ప్రయోజనం పడకేదనియు పలికిరి. నాయకులు ప్రజలు కలిసి యిక ముందు కర్తవ్యపాలనను ఆలోచించి తదనుగుణ్యంగా చేస్తూ మహాత్ముడు తెలిపిన ఆదర్శములను మనస్సులో నుంచుకొని ఆంధ్రరాష్ట్ర సాధనకు శాయశక్తులా అందరు కృషిచేయవలెనని కోరిరి.

## జయపూరులో కొత్త మంత్రివర్గం

జయపూర్, మార్చి 27 : జయపూర్ సంస్థాపు నూతన మంత్రివర్గం నేటినుండి అధికారం స్వీకరించింది. దివాను కాక 4 గురు ప్రజామండలి ప్రతినిధులు, మరి యిద్దరు సిక్కు ప్రతినిధులు మంత్రివర్గంలో ఉన్నారు. ఈమంత్రివర్గం ప్రస్తుత రాజ్యాంగపట్టం ప్రకారం పనిచేస్తుంది. కాని ప్రజలకు బాధ్యత వహించే సంస్థానంలోని వివిధపక్షాలవారు క్రొత్త రాజ్యాంగమును సాంప్రదాయ తయారు చేస్తున్నారు.

### కొత్త కాందిశీకులు అనుమతిలేనిదే రారాదు

రెవిన్యూ కమీషనర్‌వద్ద అనుమతి పొందకుండా క్రొత్తగా కాందిశీకులెవరూ జయపూర్ సంస్థానములోకి యింక ముందు రాగూడదని జయపూర్ ప్రభుత్వం ప్రకటించింది. ఇప్పటికే శరణార్థులకు పొలాల్లు కలగచేయటం కష్టంగా వున్నదట.

గత 24 గంటలలో జయపూరులో ప్రశాంతత నెలకొన్నదని ప్రకటింపబడింది. 6 గంటలపాటు నేడు కర్ఫ్యూ ఎత్తివేశారు. కొన్ని లూటీ సంఘటనలు జరిగినాయట. పరిస్థితి అదుపులో వున్నది.

### ప్రభుత్వోద్యోగుల నిరాహారదీక్ష

కలకత్తా, మార్చి 26: కలకత్తాలోవున్న కేంద్రప్రభుత్వపు కార్యాలయములోని ఉద్యోగులు 2వ తేదీ నుండియు నిరాహార దీక్ష ప్రారంభింప దలంచిరని కేంద్రప్రభుత్వోద్యోగ సంఘాధ్యక్షులగు మృణాళ కాంతిబోసుగారు నేడు ప్రకటించిరి. కేంద్రప్రభుత్వోద్యోగులు కోరిన కనీసమూలంగా కేంద్ర ప్రభుత్వం నెరవేర్చలేదు సిబ్బంది తగ్గింపుకొరకై కొందరిని ఉద్యోగములనుండి తొలగించుచున్నారు. అందుకు ప్రతిఘటనగా యీ నిరాహారదీక్ష సాగింపబడును.

### న్యూఢిల్లీ చేరిన కాశ్మీర్ ముస్లింలు

న్యూఢిల్లీ, మార్చి 25 : కాశ్మీరు యుద్ధంమూలాన పాకిస్తాన్‌లో చిక్కబడిపోయిన అనేకులు కాశ్మీర్ ముస్లిములను, పాకిస్తాన్‌లోని భారత హైకమీషనర్ కృషిఫలితంగా న్యూఢిల్లీకి చేర్చారు. వీరిని విమానంగా కాశ్మీరుకు పంపిస్తున్నారు. వీరిలో చాలమంది కాశ్మీరీ హాజీలున్నారు.

### మహాత్ముని నిర్యాణదినము

### రాజఘాటువద్ద ప్రార్థనలు

ఢిల్లీ, మార్చి 16 : నేడు శుక్రవారం గాంధిమహాత్ముడు మరణించిన దినమగుట వల్ల ఏ వి. ఠక్కరుబాపాయున్నూ గాంధి మహాత్ముని మిత్రులు పరిచితులు కొందరును యమునానదీ తీరమున రాజఘట్‌వద్ద ప్రార్థనలు జరిపిరి. అఖిలభారత వాణిజ్యమండలి సమావేశం ఢిల్లీలో జరుగుచున్నది, అసభకు విచ్చేసిన పలువురు మిత్రులు యీ ప్రార్థనలకు హాజరైరి.

### చెన్నపురికి జయప్రకాశ్ రాక

చెన్నపురి, మార్చి 27 సోషలిష్టుపార్టీ ప్రధాన కార్యదర్శి జయప్రకాశ్ నారాయణగారు బొంబాయినుంచి విమానంలో ఈ ఉదయం బయలుదేరి చెన్నపురి చేరారు. రేపు జరుగనున్న తమిళనాడు సోషలిష్టు పార్టీ సమావేశానికి హాజరవుతారు.

### పర్ణమెంటు బస్సు నడిపేవారల సమ్మె నోటీసు

మదరాసు, మార్చి 25 : ఏప్రిలు 14వ తేదీలోగా తమ కోర్కెలను అధికారులు తృప్తిపరచక పోయినట్లయితే ఏప్రిలు 15 మొదలు సమ్మెచేయ నిశ్చయించినట్లు నోటీసు యివ్వటానికి నిన్న నేపియర్ పార్కులో జరిగిన గవర్నమెంటు బస్సు పనివారల సభలో తీర్మానింపబడెను.

### రూపత్రిక నైజాము బహిష్కరణ

ఢిల్లీ మార్చి 26: ఢిల్లీలో ప్రకటింపబడుచున్న "హింద్" అను ఉర్దూ దినపత్రిక తాలూకు 17, 20 తేదీ గల ప్రతులు విమానంలో దిగగానే విమానాశ్రయంలోనే నైజాము పోలీసులు వశపరచుకొనిరి.

### కొత్తరోడ్లను తెగకొట్టుట

వరంగల్లుజిల్లా, మధిర తాలూకాలో ప్రభుత్వం కొత్తగా వేయించిన రోడ్లలో ఒక రోడ్డును ప్రజలు మార్చి 21 రాత్రి నాలుగుచోట్ల తెగగొట్టిరి.

### ఉద్యోగి రాజీనామా

మధుర ఉస్మానియా హైస్కూలు ఉపాధ్యాయుడు యస్. నారాయణస్వామిగారు నిజాం ప్రభుత్వ దమన నీతిపట్ల నిరసన తెలుపుతూ, స్టేటుకాంగ్రెసు ఆదేశానుసారము తమ ఉద్యోగానికి రాజీనామా యిచ్చిరి. వీరిని అరెస్టుచేయుటానికి ప్రభుత్వంవారు వారంటు జారీచేసిరి. ఖమ్మం తాలూకా చెలకొండపల్లిలో కాంగ్రెసు శాస్త్రిగారింటివద్ద పొనుగొలిమికలిగి వున్నారనే నెపమిడి, వెంకటియాల పద్మాకరయ్య, సీతారామాపుర్రాల యిద్దరు కార్యాలు కసుల నాటి ఆస్తిని స్వాధీనపరచుకున్నారు పోలీసులు.

